వ॥ అంత శివశర్మ తన నిలయమ్మునకే తెంచి యాషాఢభూతిం గానక కొంత యెత్తుకొని పోయెనని యిగులుపడి చింతింపుచు నర్థాపేతుం డొక్కపడియతనింగను గమనిక నొకపుటభేదనంబు బ్రవేశించి యందు నొక్కతంతు వాయ గృహమ్ము వేడికెం జేరి శయనించి యుండె నవసరమ్మున 132

కం॥ నారాయణు నంబరల
క్ష్మీరమణి నిజాంఘ్రి [కంజ] కీలితపుగు పం
జీరమున ద్రేసెనోయన
సారస బాంధవుడు నపర శరధింగ్రుంకెన్ 133

చం॥ తన మణి పోవ నంబరము ధారుణిలో వెదుకంగ వచ్చెనో!
యనదగె నంధకార నివహమ్ము, సరోజ భవాండ పేటికన్
దినపగనిడ్డ కస్తురి విధంబున, జారుల మానసమ్ములన్
ఘనముగ నైరవమ్ములు వికాసము నొందె ననంతరమ్మునన్ 134

కం॥ మరుదీశ దిగ్వధూటిక
కరకందుకమనగ గగనకాసారసితాం
బురుహామన మదనకువలయ
శరమనగ నుదయించెను శశివాడ తెంచెన్. 135

వ॥ తత్సమయంబునం గోకవిరహిలోక [శ్రీ] కరంబులును జకోరహృదయ వశీకరమ్ములును గలశపయోధి శోభాకరమ్ములును నగు చంద్ర కిరణమ్ములు భూభాగమ్మున నిండియుండెనయ్యవసరమ్మున. 136

చం॥ ఒడలికి నన్ను, గన్నులకు నొప్పగుకెంపు మనోజ్ఞజిహ్వకున్
బెడబెడ పల్కులం బ్రభులకు వేమరునుం దడబాటు గూర్పు, నో
పెదు మదిరావశత్వమునం ద్రేలుచునుండెడి తంతువాయున
ప్పుడు గని వాని భార్య పర పూరుషసంగమ వాంఛసేయుచున్ 137

వ॥ ఉండు నెడ నంబష్ఠ కన్యకా ప్రేరితయై యుచితాలంకారమ్మునం జెలువొంది మందమంద గమనమ్మునం జనునవసరమ్మునం దద్విభుండు 138

కం॥ ఒడలెఱుంగక ఖలటికి! యె
క్కడ బోయెదు మున్ను కన్ను గవ ద్రామినకై

వ॥ అని వివర్ణవదనుండై నిట్టూర్పులు నిగిడించుచు హిరణ్యకుండు
నిట్లనియె. 14

కం॥ తన పూర్వజన్మ కర్మము,
లనుదినము శుభాశుభమ్ము లందించు, జగ
జ్జను లాదిజీవులకు దై
వ నియోగమునవలనఁ గడవవచ్చునె తలఁపన్! 15

గీ॥ సుజనులకు లేమి, గ్రహపీడ సోమసూర్యు
లకు, భుజగేంద్ర, మాతంగశకున, సంచ
యమున, కరయంగ బంధన మాచరించు
నలఘుతరమైన, విధి శక్తిఁ దెలియనశమె! 16

శా॥ తారామార్గమునం జరించు ఖగసంతానమ్ము, వారాశిలో
నారూఢస్థితినున్న మీనతతి కైవాధీనతన్ భూజనో
గ్రారంభంబున గాదె! చిక్కుపడుఁ, గాలాతిక్రమక్రీడ, నె
వ్వారల్ నేర్తు రుపాయధైర్య బలగర్వ ఖ్యాతిఁ బెంపొందినన్॥ 17

వ॥ అని యివ్విధంబున హిరణ్యకుండు హృదయతాప నివారకంబు
లగు వాక్యమ్ములుపలికి యాచిత్రగ్రీవ పాశవిచ్ఛేద నారంభుండై నిలిచిన నతం
డిట్లనియె. 18

కం॥ ఓయన్న! యీ విహంగ ని
కాయమునకు మున్నె చనఁగఁ గౌతుకమగు నే!
యీ యనఘులబంధమ్ములు
పాయమ్మనఁ బాయఁజేయు పరమప్రీతిన్॥ 19

గీ॥ అనిన మూషికపతి విహంగాగ్రగణ్యుఁ
జూచి కీర్తింపఁదగు నీ విశుద్ధచరిత
మనుచు బంధన విచ్ఛేద మొనరఁజేసి
యతిథి పూజల నన్నిఁటి నాదరించె॥ 20

వ॥ వెండియు నుపగూహనం బాచరించి పతత్రి సమేతుండగు చిత్ర
గ్రీవు వీడ్కొని నిజగృహంబునకుం జని సుఖంబుననున్న సమయమ్మున,

నఖిల వృత్తాంత వర్ణియగు లఘుపతనకుండు నాహ్లాద పల్లవిత హృదయుండై
చనుదెంచి హిరణ్యకున కిట్లనియె. 21

సీ॥ చెలిమి నీతోడుతఁ జేసెదఁ గదు [మహా]
నీయ పాత్రుండవు. నీవు వలఁప
ననిన హిరణ్యకుండపుడు నీవెవ్వండ
వనినఁ గాకంబు నేననియె, మూషి
కంబు, నీతో మైత్రి గావింపఁబోలునే!
యే, నీకు నాహారమైన దాన
ననపుడు, నాకు నిన్నాహార మొనరింప
నాఁకలి దీరునే! యనని చూడఁ,

గీ॥ బ్రతుకుదును నీవు జీవింపఁ బతగ విభుని
భాతి, నామాట విశ్వసింపంగ వచ్చు
వదరుఁ బలుకులు నీదోర్చనములయందుఁ
గలవె! యిందుకు నీ చెలికాఁడె సాక్షి. 22

వ॥ అట్లు గావున మద్భాషణమ్ములు భవద్భావంబునం గైతవమ్ము
లుగా వలంచెదవేని యోజింగించెద వినుము. 23

కం॥ ఖలుదంభము సుజనులపైఁ
గొలుపదు తృణవహ్ని శిఖల, కూపార జలం
బులఁబోలె, మదిదలంపఁగ
బలభిన్నిభభోగ! నూత్న భరతాచార్యా! 24

వ॥ అనిన విని హిరణ్యకుండా లఘుపతనకున కిట్లనియె. 25

కం॥ ధరఁ జపలుఁ డఖిల కార్యాం
తరములఁ దమకించి పొలియు, ధర్మపరుఁడు బం
ధురమతి వివేకయుతుఁడై
కరము సుఖస్థితిఁ దనర్చుఁ గరణిక లక్ష్మా! 26

మ॥ అనినన్, వాయసమిష్టమైనది గజాస్యా [శ్వాన్వ] యోత్తంస! వెం
పున నీతోడి సఖిత్వమన్న, విని యా పుణ్యాత్ముఁడేఁ జెల్మి యొ

కం॥ ధర సజ్జనులకు ద్రవ్యము
[illegible] జెల్మి, [illegible]ంబున నోం
[illegible] ధనమెల్లఁ జూతురు
[illegible]మాంసములట్లు, నెపుడు [illegible] లక్ష్మి! 34

వ॥ అని [illegible] సమయంబున. 35

గీ॥ [illegible], మూషక విభుండు
వాయసమ్ము[illegible] వేడ్క
[illegible]ంతరముల,
న[illegible] మృగమాంస ఖండమ్ములఁ [illegible] తెచ్చి. 36

చం॥ తన చెలికాఁడు వాసుఁ బ్రమదమ్మున మెక్కుచు సంతతోత్సవం
బునఁ జెలువంది యంత బలిభుక్ప్రవరుండును నా హిరణ్యకుం
గనుఁగొని, యీ ప్రదేశమునఁ గ్రవ్యము లేదు శరీరపోషణం
బున కనఘాత్మ! కానలయుఁబోయెద నెచ్చటికైన నిత్తఱిన్. 37

వ॥ అని, యేతత్ప్రదేశంబు గడచి గవ్యూతి మాత్రంబు చనిన
నం[illegible] సరోవరంబు గ[illegible] తన్మిత్త్రయసఖుండు మంథరాభిధానుండగు
[illegible]కమఠేంద్రుండు జలచరాహారమ్ముల నన్ను [illegible]ంచు నేనచ్చ[illegible]
బ[illegible]ద, ననిన విని హిరణ్యకుం డిట్లనియె. 38

ఉ॥ పాయఁగలేను నిన్ను ననుఁ భద్ర! సరోవరమందుఁ గూర్చబో
వాయస! యన్న చంచువుల వాఁ గ్రహించి చలమ్ము మీఱ, వై
హాయస వీథినేఁగి వమం[illegible]ముల్ బొడగాంచి వేడుకన్
వాయుచలత్తరంగచయవారి కణమ్ములఁ, నేవ దేఱఁగన్. 39

కం॥ అంతఁ బ్రియమ్మున మంథరుఁ
డెంతయు సంభ్రమముతోడ నేతెంచి, సరః
ప్రాంతమున నున్న వారల,
సంతస మందించె నధిక సత్కారములన్. 40

గీ॥ అంత నీ మూషికాగ్రణి, నాదరమునఁ
జంచువులఁ బూని విజన సంస్థానమైన

యివ్వనంబున కేతెంచితి, వ్వాడీతఁ
డెవ్వఁ డెఱిగింపుమనఁ, గాక మిట్టులనియె. 41

కం॥ అనఘా! వినుము హిరణ్యకుఁ
డను మత్తేభ [ముఖ] వాహనాన్వయ ముఖ్యుం
డనుపమమతి, నమరగురుం
డనఁబరగును నఖిల గుణ సమంచితుఁడనయన్. 42

వ॥ అని చిత్రగ్రీవోపాఖ్యానం బతని కెఱింగించి యితండు పరమోప
కారి యగుట దెలిసి సకౌతుకంబుగ మిత్రత్వం బొనరించితి నన, నా కచ్ఛపేం
ద్రుండు విస్మితహృదయుండై హిరణ్యకుం గనుగొని,— 43

కం॥ అనఘా! విజనారణ్యం
బున, కరుదెంచిన విధమ్ముఁ బొలుపొందఁగ నే
వినవలతుఁ జెప్పవే యని
తను నడిగినఁ జెప్పఁదొడఁగెఁ దన్మూషికమున్. 44

వ॥ మున్ను మహిళారూప్యంబను పురసమీపంబునఁ జూడాకర్ణుం
డను భిక్షుకుండు మఠస్థుండైయుండు నతనిం జూడ వీణాకర్ణ [బృహస్ఫిక్]
నామధేయుండగు భిక్షుకుండు సేరవచ్చిన నతని నెదుర్కొని యర్ఘ్య
గత పూజలం బరితృప్తునిఁ జేసి, యతం డొనరించు హరికథలు వినుచు
సమయంబున, నా చూడాకర్ణుండు భిక్షమ్ము దెచ్చుకొని భుజియించి శేషిం
చిన యన్నం బొకపాత్రను సంఘటించి తత్సమీపమ్మున, నునుచుకొని యున్న
సమయంబున నేను నా మఠమ్ము బిలంబులో నివాసమ్ముఁ జేసికొని
యుండి బహుపదార్థ సంగ్రహుండ [నయ్యును], లోభంబున క్షుత్పిపాసా
పరవశుండనై బిలంబు వెల్లి వచ్చి తచ్ఛేషాన్నంబు భుజియించుచుండఁ
జూడాకర్ణుండు నన్నుం గనుగొని కథ వినుట మాని యొక వంశదండంబున
నన్నడిచిన నేనది తప్పించుక బిలమ్ము లోపలికిం బోయితి, నా సమ
యంబున. 45

సీ॥ మూషికమ్మును గొట్టె మూర్ఖ, చూడాకర్ణుఁ
డని బృహస్ఫియుఁ గోపమడరఁ, జూచి

కథలు నేవర్ణింపఁగాఁ బరభ్రాంతిచే
నన్యచిత్తుఁడవైతి వాగ్రహమున
నెలుకఁ గొట్టఁగఁబోతి చలకేమి ముని! యన
నతఁ డిట్టులను, భిక్షుఁడల్లఁ వినిన,
దండించితిని నాఁగ వానికి బలఁగమ్ము
గలదో! యెక్కటో! చెప్పు ఘనుఁడ యొక్క-

గీ॥ యెలుకమాత్రంబునకు నింతయలుగ నేల
యతిపతీ నీకు! కలవొక్క యమితకథయు,
మున్ను వారణ మూషికములకు నడిన
నానతిమ్మని స్థల భిక్షుఁ డడుగుటయును, 46

వ॥ మహాత్మా! తొల్లి గోదావరీ తీరంబునఁ బ్రభంజనమ్మను పట్టణంబు గలదా, పురిసమీపంబున శోణితయను నది ప్రవహించుచుండు, నాయేటిచెంగటి నేల బొఱియలలో విఘ్నకుండను మూషికంబు నివాసంబు జేసికొనియుండి, సమీపక్షేత్రంబులం బండిన ధాన్యంబాహారంబు జేసికొని, యొక్కనాఁడు ప్రమాదవశంబున నేటిలోనంబడి ప్రవాహమ్ము వెంబడి పఱవంబోవు నవసరమ్మున,— 47

కం॥ వారణపతి భీముండను
ధీరుఁడు జలకేళి సల్ప, దేవియుఁ దానున్
ఆరూఢిగ నయ్యేటికిఁ
గోరిక నేతెంచి నీటఁ గ్రుంకుచునుండన్. 48

వ॥ ఆ విఘ్నకుండును జలంబులం బడిపోవుచు శుండాల మిథునంబుగని, దగ్గఱంబోయి కరిరాజా! దిక్కులేక పఱవం బోవుచున్నవాఁడ నన్ను వెడలింపుము నీకు నొక యవసరంబునకు వచ్చువాఁడ, నన్నుగాంచెం బని చూడకుమని విన్నవించిన గజపతియును గృపాసముద్రుండు గావున నాగజ ముఖాశ్వంబు దన కరంబునంబట్టి యేటి దరినింబెట్టె, నదియును నతని దీవించి నీకు నాపద వచ్చువేళఁ దన్నుం దలంపుమని చెప్పి తన్నిలయంబున కరిగె. నంత గజేంద్రుండును జలకేళి సాలించి తన సతియుం దానును దత్సమీపారణ్యంబున నిష్టచర్యల వసియించియుండె,—అంత నేనుఁగు వేఁటకాండ్రు తద్విపినంబు ప్రవేశించి యోదంబులు ద్రవ్వి చిల్లరత్రోవలుగట్టి కరినాథుఁడు

వదినిఁ జేరుట కొఱకై త్రోవఁ జేసి, యచ్చటచ్చట పచ్చికయు నిక్షుదండంబులు
నెరపి చుట్టును ముళ్లడచి తమతమ గృహమ్ములకుం జనిన సమయమ్మున. 49

కం॥ గజపతి సతియును దానును
గజిబిజిలే నట్టియడవిఁ గాలూదకఁ వే
గఁజనియు మేపులు మేయుచు
నిజముగ నోదంబులోన నెరిఁబడి [రంతన్] 50

కం॥ సతిపతులు గ్రంతఁబడియా
తతమతి వెడలంగ లేక దైవమ! యనుచున్
మతిఁగలఁగుచుండి, మూషిక
పతిఁదలచుఁడు, నతఁడువచ్చె బంధుయుతుండై 51

గీ॥ వచ్చి వంగిడిఁ బడియున్న వారణములఁ
గాంచి దుఃఖితుఁడై బలఁగంబుఁ జూచి
పరుల నొరలంగ ద్రవ్వి యీవంతియుగము
వెడలఁ దివియంగవలయు వివేకులార! 52

వ॥ అని తన,కులపతులకుం జెప్పి యసంఖ్యాతంబులగు నెలుకలం గూర్చి
యాక్షణంబున వంగిడింబూడ్చి గజద్వయంబును వెడలించిన,- 53

గీ॥ గుంత వెడలివచ్చి కుంజర యుగళమ్ము
మూషికమున కెలమి మ్రొక్కి-మ్రొక్కి-
నీవు గలుగఁబట్టి నేఁ బ్రతికితి నీకుఁ
బిడ్డ పేరుపెట్టి పెంపుగందు॥ 54

వ॥ అని కరిపతి మూషికపతినిఁ బెక్కువిధమ్ముల స్తుతియించి నేఁ
బోయివచ్చెద నన్ను మఱువకుమీ! యని చెప్పి యెలుక కులమ్ముచేత నా
మంత్రితుండై యథేచ్ఛ నరిగె. ఎలుకరాజును గజపతికిఁ దనకు వచ్చిన
పూర్వబద్ధ సఖ్యమ్ముఁ దన కులంబువారలకుఁ జెప్పుచుఁ దనయింటి కరిగెనని
బృహస్పి చూడాకర్ణున కెఱిఁగించి వెండియు నిట్లనియె. 55

కం॥ శాండిలి యనఁదగు బ్రాహ్మణి

భృగుఁ జాలుఁ జూప మూర్ఖ
ప్రకటములగు నరములిపుడు పారణసేతున్॥ 63

గీ॥ అనుచు లుబ్ధక మృగవరాహములఁ దత్పృ
దేశములఁబెట్టి డాసి దురాశఁజేసి
యల్లెఁగొఱికినఁ దెగి హృదయమునఁ బడిన
నంతకునిఁజేరె జంబుక మాక్షణమున. 64

కం॥ అని యిప్విధంబు దెలియన్
వినిపించి యతండు దేవ విప్రులకుంగా
క, నరులు తమకై కూర్చిన
ధనమంతయు నిలునదనుచుఁ దరుణికిఁ జెప్పెన్॥ 65

వ- అని యివ్విధంబునఁ జూడాకర్ణునకు నా బృహస్ఫి యొఱిఁగించి యమ్మూషిక ధనంబు, దేవభూదేవ యోగ్యంబుగాదు. ప్రసన్నంబు కలిగినను పరాశవలన భిక్షాన్నంబు భక్షించి యనవరతంబు నీ కపరాధం బొనరింపు చున్నది నే యతిఁగావున దీనియర్థంబు సకలంబు గ్రహించితినని సంభ్రమంబున లేచి మన్నిలయంబు జేరి, 66

ఉ॥ కేల ఖనిత్ర మొప్పఁ బరికింపుచు మద్బిలభూమిఁజేరి యా
భీలతఁ ద్రవ్వి నాధనము భిక్షుఁడు గైకొనె నాఁటనుండి, దుః
ఖాలసమార్తినై, యిడుమలందుచుఁ గుందుచు నివ్విధంబునన్
బేలక్రియన్ జరింపుదు నభేద్య గుణోన్నత! విభ్రమంబునన్॥ 67

వ॥ అని చెప్పి మఱియు నిట్లనియె. 68

కం॥ ధనముగలవాఁడె పండితుఁ,
డనఘుఁడు, ఘనకీర్తిమంతుఁ, డ న్వయపూజ్యుం,
డ నవరత దానశీలుఁడు,
విను మవనీతలమునందు విత్తయలక్ష్మా! 69

కం॥ పరదేశమె నిజదేశము
పరులే బాంధవులు ద్రవ్య పరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది!
పరమార్థం బిదియె నూత్న భరతాచార్యా! 70

కం॥ కులపతిరోయను జుట్టి
మ్ములు వాయుచుండోవలు కష్టపుం బలుకుల, ని
మ్ముల నాతఁ డొడఁగుచుండును
కలియుగమున బ్రహ్మహీనుఁ గనితివె లక్ష్మా! 71

కం॥ స్మృతిఁబొందిన జనునైనను
హితువెల్లను బాయుమనుచు నకీర్తిలోనన్
మఱుపడఁడు జేరఁజేయక
బ్రతిమాలిన, నోపలు సూత్ర భరతాచార్యా! 72

కం॥ ఇలలోపల ధీయుతునకు
వలయును వృషభమనము బంధువర్గము పోగనన్
పలుపోసి చూడ, లేమియుఁ,
గలిమియు, పోనమ్మగానఁ గనితిక లక్ష్మా! 73

కం॥ పామరుల వేడఁజేయును
ధీమన మణఁగించి బుద్ధి తేఁకువ చెఱుపున్
క్షేమ[స]తులఁ [నెడఁ] బాపును
లేమియుఁ గష్టమ్ము సూక్ష్మ లిఖితాచార్యా! 74

కం॥ తలఁపదశవాజి మేధ
మ్ములనైన ఫలమ్ము చలనబుద్ధి రహితుఁడై
చెలిమి యొనరించు, సద్గుణ
కలితుండగు నరునిఁబొందుఁ గరణికలక్ష్మా! 75

గీ॥ ధనముపోయిన వృథలక్ష్మిఁ దలఁగనీక
మంచి మనమున సద్ధర్మ మహితపదము
దప్పి నడవక, పరుల సంతాపముడుప
వైద్యుఁడన సంచరింతు భూవలయమందు. 76

వ॥ అని యివ్విధంబున నా హిరణ్యకుండను నెలుకనిజకథా వృత్తాంతంబును నీతిప్రకారంబును నెఱింగింప నాకర్ణింపుచున్న జరత్కచ్ఛపేంద్రుం గనుంగొని లఘుపతనకుం డిట్లనియె. 77

కం॥ కటిబుధ బొంచఁబడినను
గటియే వెడలించుఁగాక! కాపులతఁ మే
నిరుపమపుణ్యం డీతని
సటయంగను నీకు కాక యసువ్యలనశేము! 78

మ॥ అనిన న్మంథనుఁ డక్క కాకయని మీ నాహార సంతుష్ట చి
త్తునిఁ గావింపుము గాక మూషికను మేతుంచై గుణగ్రాహ్యుఁడై
చనుమానంబున నుండగా నెదుట నాశ్చర్యంబుగాఁ దన్మహా
వనమధ్యంబున నాను బంతికొంచెి న్వెచ్చెన్ మృగంబుద్ధతిన్ 79

వ॥ అయ్యవసరంబున విహ్వలిక్షత హృదయుండై మంథరుండను కాకంబు నీక్షించుచుండంబంచి మూషికంబును నేనును నిచ్చటనే యుండను మము లేడి వచ్చినవిధంబు తీక్షుంబున నెఱింగి దమ్మనిన, నట్లెయని యవియు నుంజని యొక్క మహీరుహంబుపై గ్రాలి, యామృగంబున కిట్లనియె. 80

గీ॥ ఎవ్వఁడవు నీవు బెదరంగ నేమికార
ణంబు నీ పూర్వకథయెల్ల నాకుఁ జెప్పు
మనిన వెరగంది మృగము తిర్యఙ్ముఖంబు
చేసి కాకంబుతోడుతఁ జెప్పఁ దొడఁగె. 81

వ॥ [ఏను చిత్రాంగుండనువాఁడ మున్నొక్క] యటవిఁ బ్రవేశమ్మున నా జననీ జనకులు నివాసమ్ము చేసికొని మా యమ్మ నన్ను గర్భమ్ముతో నుండి సుఖప్రసవంబుచేసిన దినంబున. 82

గీ॥ శబరుఁ డొక్కఁడు వేఁటకుఁ జనలుఁడగుచు
నడవిలోపలఁ దిరుగాడి యమ్మ నన్ను
గన్నచోటికి నేతెంచి కాంక్షతోడ
నేయఁగడఁగిన నా తల్లిపోయె పారి. 83

కం॥ తడియారకుండ నేనును
దడబడుచుండంగ బోయదగ్గటి నన్నున్
వడిఁబట్టి యెత్తుకొని తాఁ
గొడుకని భూమిపతి కమ్ముకొనియెన్ బ్రీతిన్॥ 84

గీ॥ హాయనత్రితం గొనుక భూపతియును దన
పుత్రునకిడె నతఁడు క్రీడించేసి
నన్ను బెంచి వేడ్కనా [వచనముల] నైఁడి
యుం దెలిసియె నాకు వంశమొంద. 85

వ॥ నేను భూపతి కుమారున కల్లారు ముద్దునేయుచు వేడుకవేళ వెంటవెంట తిరుగుచు గంతులిడుచు పదములు వాడుచు నందుల దూరుచు బాలుర మీఱుచు వంచించుకొని యొక్కనాఁడు బాలుతోఁడంగూడి పురోపవనమ్మునకుం జని వంగివంగి వచ్చిక మేయుచుండ. 86

ఆ॥ వె॥ బాలుఁడొక్కఁడు వచ్చి పట్టినన్ గొట్టిన
నిరపరాధి నన్ను నీవు గొట్టి
నేల యనుచు నేను బాలునిఁ దిట్టితి
నరి మనుష్యభాషణముల వేగ. 87

వ॥ నే తిర్యక్కనైయుండియును మానవ భాషణమ్ములఁ బలికిన పలుకులు రాజకుమారుం డాలించి,— 88

శా॥ నా వాక్యమ్ములు మర్త్యభాషణములై నన్ రాజపుత్రుండు, మహా
హావేశమ్మును బొంది తేజీయపు డాద్యంతం బెఱింగించె రా
జ్ఞేవస్వామి కతండు రేపకడ భూదేవోత్తము శ్రేణికిన్
నా వృత్తాంత మెఱుంగఁ జెప్ప మదిలో నాశ్చర్యముప్పొంగఁగన్. 89

గీ॥ అమ్మహాత్ములు గ్రహశాంతి యప్పుడుచేసి
బాలుదీవించి యమ్మహీపాలు వలన
ద్రవ్యసంపదఁబొంది నితాంత సమ్మ
దమున నృపుఁగాంచి పలికిరా సమయమందు. 90

వ॥ దేవా! యిది యొక్క కారణంబున మృగశరీరంబు నొందినది. గాని మృగమ్ము గాదు. నైవభాతి భవన్మందిరంబున నిలుపవలదు. మున్ను దీనిం గొనితెచ్చిన లుబ్ధకుచేత నే యథాస్థానంబున విడిపింపవలయున ననభూభావల్లభుం డాహ్లాద పల్లవిత హృదయుండై యట్ల చేయించె నవ్విధంబున— 91

కం॥ ఏనును నాతల్లిం గని
నేనతఁ గలిసికొని యడవిఁ జెనఁగుచుఁ దంతేన్
మానుగఁ జన్నులు గుడుచుచు
నానాఁటికి దేహపోషణంబును గంటిన్. 92

ఆ॥ వె॥ అందుఁ బెద్దకాల మఖిల బంధువులతోఁ
గూడియుండఁ గలిగెఁ గొమరు మిగుల,—
పిదప నొక్క బోయ ప్రేరేపఁగను బాయ
వలసె నిపుడు దైవవశము వలన. 93

వ॥ ఇది మత్పూర్వ వృత్తాంతంబు జనసత్త్వ సంపన్నుండనయ్యును బోయవాని యుఱులు నాచరణమ్ములం దగులుటంజేసి కుంటువడియున్న వాఁడ, ననినఁ గాకంబు సకౌతుకంబుగా నిట్లనియె. హరిణపతీ! భవద్బంధమ్ము వాయను నుపాయంబే సంఘటించెదనని చెప్పి మంథర హిరణ్యకు లున్నకడకు వచ్చి వేఁటవృత్తాంతం బెఱింగించి క్రమ్మఱచేని మృగపుంగవుం దోడ్కొని చను దెంచిన, 94

కం॥ ఆ మంథరుండు ప్రియమున
నేమమె చిత్రాంగ! బోయచేఁ జడి సుకృత
శ్రీ మహిమమునఁ బ్రతికితె
నా మందిరమందు నిలుము [నా నెయ్యమునై]. 95

గీ॥ అనుచుఁ బాశమ్ము లా హిరణ్యకుని వలనఁ
బాయఁజేయించి కారుణ్య భావ మొప్ప
నతిథి సత్కార పూజల నాచరించి
చెలిమి యొనరించె నిశ్చల చిత్తుఁడగుచు. 96

ఉ॥ పంబిన వేడ్కతోడుత నుపాయ చతుష్టయ మోయనంగఁ బు
ణ్యంబుల కెల్ల నెల్లలగు నల్వురుగూడి లసత్కథా ప్రసం
గంబులఁ బ్రొద్దుపుచ్చుచు సుఖస్థితి నుండఁగ నంతఁ గొంత కా
లంబున కొక్క లుబ్ధకుఁడలాత భయంకరుఁ డేఁగుదెంచినన్. 97

ఆ॥ వె॥ ఎగసి చనియెఁ గాక, మెలుక గర్తంబున
కేఁగె, నడవి మృగము డాఁగె మృగయుఁ

ద్విరదా, నాగజ, వాజి, వాహన ఘనా, హీన, స్ఫురత్కీర్తి ల
క్ష్మీ రాజీవదళాయతేక్షణా! బంధుశ్రేణీ పరిరక్షణా! 111

కం॥ గంభీరవార్ధి నిర్జిత
కుంభీనస! గోత్ర శైలకూర్మాహిప సత్
కుంభీంద్ర భారభరణ వి
జృంభిత దోస్తంభ! శౌరిసేవాభ్రమణీ! 112

తోటకవృత్తము॥ హితబాంధవ కల్ప మహీరుహా! సం
తత భోగవి నిర్జిత నాకప! భూ
నుత సూనృతవాక్య! వినూత్న కళాం
చితకీర్తి! వినందిత శిష్టజనా! 113

—: గద్య :—

ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యావిచిత్ర, తిప్పన మంత్రి
పుత్ర, సుజన విధేయ, భానయనామధేయ,
ప్రణీతంబైన పంచతంత్రి యను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము



# తృతీయాశ్వాసము

శ్రీనాథ చరణకమల
ధ్యాన పరాయణ! జలాధిపంక్తావళిఘను
ధ్యానమితకీర్తివర! ల
క్ష్మీనారాయణ! కళావిశేష విధిజ్ఞా! 1

వ॥ సంధి విగ్రహంబను తృతీయతంత్రం బాకర్ణింపుము,— 2

చం॥ మొదల విరోధియైన యతిమూఢు సఖిత్వము విశ్వసించినన్
దుదిఁ జెడిపోవు భూవిభుఁడు, వొల్లి గృహాంతర ఘూకపంక్తి యొ
ప్పిదముగ వాయసప్రభుఁడు పేర్చిన భీకర వహ్నికీలలన్
మదమఱి కూలదే! యన కుమారుల కిట్లని తన్ను వేఁడినన్॥ 3

కం॥ ఆ విష్ణుశర్మ దృఢమతి
జీవ ప్రతిమానుఁడపుడు సెప్పెన్ దెలియన్
భావజనిభరూపులకా
భూవర పుత్రులకు వేడ్కఁ భూరి ప్రీతిన్. 4

సీ॥ తన శాఖలేర్చి మార్తండుని తేరి ప
ద్ధతికి మిక్కిలి విరోధంబొనర్ప
తన నీడ ధారుణీధవళాయతాత్మికి
నాతపత్ర క్రియ నతిశయిల్ల
తన కోటరములు పతంగ పుంగవులకు
నెంతయుఁ జెలువొందునిండ్లు గాఁగ
తన ఘనమూల సంతాన మశ్రాంతము
శేషుతోఁ బాయని చెలిమి సేయ

ఆ॥ వె॥ ప్రళయవేళనైన పత్రమాత్రనె విష్ణుఁ
బ్రోవఁ జాలుననుచు బుధులుదలఁప
నొక్క యడవి నడుమనుండుఁ దావలముగ
వటము భువన వినుత జటమునగుచు. 5

కం॥ ఆ తరుశాఖను బలిభు
గ్వ్రాతము సేవింప నొక్కవాయసము ముందున్,
జాతి వసుఁగొల్వ నతి ప్ర
ఖ్యాతిగ నుండును దివాంధమత్రాంతమ్మున్. 6

వ॥ ఇట్లుండి యొకనాఁడతి క్రోధారుణీకృతలోచనుండగుచు విమ
తాక్షిభానుండగు దివాంధవల్లభుండు ఘూక సహస్ర పరివృతుండై విభావరీ
సమయంబునఁ బ్రభంజన జవంబునం జనుదెంచి నిద్రావశంబు నొందియున్న
వాయసనివహంబుపైఁ బడి చరణనఖరమ్ములన్ జంచుపుటమ్ముల భేదింపఁ
దొడంగిన, నందు పరిదేవనారుతమ్ముల గగనమ్మున కెగసియు, నన్య భూజ
మ్ములన్ జేరియు, దిగ్భ్రమం బొందియుఁ, గ్రూరాంత కాలయమ్ము డాసియు,
నిట్లనేక ప్రకారమ్ములఁ బలాయనత్వంబునందినఁ గాకిమూఁకలకు దొరయగు
మేఘవర్ణుండను వాఁడప్పుడు,— 7

కం॥ పరుల కభేద్యంబగు త
త్తరు కోటరమునను డాఁగి తన జీవంబున్
వెరవొంద నిలుపుకొని భా
స్కరోదయమ్మైన శోకసంయుతుఁడగుచున్. 8

వ॥ ఉండు నవసరమ్మున, నతని మంత్రులు, నుద్దీపి సందీపి ప్రదీప్యాదీపి
చిరంజీవులను నేవురు దివాంధవల్లభు బారికిందప్పి యొక్కటం గూడికొని
తమ యేలిక యగు మేఘవర్ణుం డున్నచోటికిం జని దండప్రణామం బాచరిం
చిన బలిభుగ్వల్లభుం డిట్లనియె,— 9

గీ॥ బ్రతికితిరె! మీరు కౌశిక ప్రతతిచేత
నిట్టి యాపద నను దెంచె నేమి సేయ
వచ్చు, దైవవశంబని వారితోఁడఁ
బలికి చింతావశీ కృతభావుఁ డగుచు,— 10

వ॥ అయిననేమి కాఁగల కార్యంబులు కాకమానునె! మనకిప్పుడు
నేయవలయు కృత్యంబెయ్యది యొతింగింపుఁడనిన నందు నుద్దీపి యిట్లనియె. 11

**కం॥ తన సదృశుఁడైన, సామంబును, నల్పుండైన దండమును, మత్తుండై
నను, భేదమధికుఁడైనను బని వడిదానమ్ము నేయఁబరగు ధరిత్రిన్** 12

కం॥ భూపతియును గపటం బె
ప్పాపలకేనియును గలుగు, వారి సమీపం,
బోరయ విడిచి భయంబున
దూరపు స్థానంబు నొందుదురు ధీమంతుల్. 13

వ॥ అని పలుకు నవ్వాక్యమ్ము లాకర్ణించి, సందేహయానవం బాలోకించి మన కెయ్యది కర్తవ్యంబని మేఘవర్ణుం డడిగిన, నతం డిట్లనియె,— 14

ఉ॥ స్థానము వాయునంత నిజసైన్య సమూహము వాయు, వైరి సం
తానము మీఁది కార్యములు దానొనరింపఁగ నోపఁ, డాత్మ సం
తాన భృతార్థి తార్థియగు గావున, బుద్ధిఁదలంచి యాచికన్
స్థానబలమ్ము కావలయు ధారుణి, నిర్థయలక్ష్మి ధీమణీ! 15

గీ॥ నెలవు బాసి మున్ను నల హరిశ్చంద్ర కాం
తేయు లంతవారు దీనవృత్తి
నొదిగియుంట వినమె మనమెవ్వల బాసిన
బాయఁదగదు నేల ప్రాజ్ఞులకును 16

వ॥ అనిన విని యతండు ప్రవేశింపనుం గొని యెయ్యది యాచరింపవల యుననిన, నతం డిట్లనియె,— 17

చం॥ అతి బలవంతుఁడైన వినయమ్మున వారలతోడి మైత్రి సా
తతమును నిశ్చలంబగు మనమ్మునఁ జేసి, నిజప్రదేశ సం
గతుఁడయి పొల్చు టొప్పు, నదిగాదని యొండొక దేశమేఁగినన్
ధృతి మెయిపోకతో, వినుము ధీయుత! నొచ్చు నతండు నెమ్మనన్. 18

వ॥ అట్లుగావున వారలతో సామం బాచరించి యిచ్చటనుండుద మనిన, నవ్వాయసవిభుండును, ఆదీపింగనుంగొని భవన్మతం బెఱింగింపుమన, నతనికతం డిట్లనియె,— 19

కం॥ పరులొక కాలము చేకొని
పరిమార్చిరి మన బలంబుఁ బ్రస్ఫుట కీర్తిన్
బరిమార్ప మనము నాక్రియఁ
బొరిఁగొందము, కపట బుద్ధి పొగడిత కెక్కన్. 20

కం॥ వాయస దివాంధులు మనము, ది
చాటింప నిశాంధులము, నిశావేళ బలం
బారూఢమ్ముగ నొంచిరి
వారలు, దివమునను నొంపవలయును మనకున్. 21

కం॥ అని యిట్లు మంత్రులు హితం
బునఁ జెప్పిన నీతి మార్గమున్విని ధీమం
తుని ననఘు నా చిరంజీ
వినిఁ [గనుగొని] ప్రీతిఁ గాకవిభుఁ డిట్లనియెన్. 22

వ॥ త్వద్బుద్ధి బలంబు పెంపునఁగదా యిప్పాభవం బనుభవింపఁగలిగె నిప్పుడస్మత్కులోపభోగ్యంబగు రాజ్యం బరివశంబు గాకుండ నిలుపుమనిన, నతం డిట్లనియె,— 23

గీ॥ పరులకై తపంబు [వలన] నారంభమ్ము
లుడిగెనేనిఁ దలఁప నొకటికలదె!
[వివిధ] జీవరాశి విశ్వాసమున నమ్మ
కేష్టవస్తువంబు గానలేదు. 24

చం॥ ఓ యగ, మంత్రరక్షితగు, నాతతకైతవ గూఢభావుఁడై
పరులకు నాప్తుఁబోలె యనపాయ [గతిన్ హిత] మాచరింపుచున్,
ఒనఁడుగ నొక్కనేళఁ దన వైరమణంచి [మెలంగ], బుద్ధి భా
స్వరుఁడయి యుండుటొప్పు, గుణవార్నిధి! విశ్రయలక్ష్మీనిధీ! 25

వ॥ అని యిట్లు చెప్పి యాచిరంజీవి యిట్లనియె దేవా! సామదాన భేద దండమ్ములను నుపాయచతుష్టయమ్మునుఁ, బ్రభుమంత్రోత్సాహం బులను శక్తిత్రయంబువలనను, సంధి విగ్రహయానాసన ద్వైధీభావాశ్రయం బులను షడ్గుణంబులం దనరి, జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజమ్ములను షడ్గు ణైశ్వర్యంబుల సంపన్నుండై, భూతభవిష్యద్వర్తమానంబులను నెఱింగి [న భూపాలుఁడు] పరులక భేద్యుండని వెండియు నిట్లనియె,— 26

కం॥ తన శక్తియుఁ బరశక్తియు
మనమునఁ దలపోసి శిష్ట మంత్రుల బుద్ధుల్.

గని యొనరించిన కార్యము,
ఘన కీర్తికి నెక్కు_నవని, గణికా [illegible]! 27

కం|| బకము క్రియ, వేళ యాశ్ర [illegible]
తకు, మానమ్మున జరింపఁదగు, నటమీఁదన్,
బ్రకటమ్ముగ సింహము పో
లిక మెలఁగఁగవలయు, సూత్మ్మ లిఖితాచార్యా! 28

గీ|| ఇన్ని గుణముల లోపల నేదియైన
దనకు నసువగునట్టి చందమ్ముఁ జూచి,
దేశకాలముల్ మదిలోనఁ దెలిసి మెలఁగు
నతని బొందును సంపద లతిశయముగ. 29

వ|| మున్ను శౌర్య సంపన్నుండై దేశకాలమ్ము లెఱింగి చరించు నతని
గుణదోషమ్ము లెఱింగి విశ్వసింప జన......భుని చేత......ని. మహో
ద్యోగిని నిందిర యాశ్రయించు, మంత్ర ప్రభావమ్మున దుష్టమ్ముగ భుజంగ
మ శక్తులనణంచునట్లు చోరులఁ,గామాతురుల,దోష స్వభావుల, నతి లుబ్ధుల,
దుర్మదాంధుల, సమరభీరులఁ, దర్దండ నీతిచేత దండింపవగు. వైవమానుష
మ్ములు గల్గిన సహాయులగు నియామకుల వలనఁగాని, వ. వాహిని సందో
హమ్ముఁ దరియింప నలవిగాదని, యతం డిట్లనియె— 30

ఉ|| ఆనయ మంత్రమూలము జయమ్ముటుగావున, నీకుణమ్మునన్
వారల జేరి సూత్నమృదు వాగ్విసరమ్మునఁ దేల్చి, మైత్రి పెం
పారగఁజేసి కార్యఫలమందుట మేలన, నాలకించి ప్ర
జ్ఞా పమశీయుఁ,దత్సచి నసత్తము, నాతని సూచి యిట్లనున్,— 31

కం|| ఏరీతినైనఁ గౌశిక
వారముతో సంధిఁ జేయవచ్చునె! మనకున్
వారికి దలపోయం గను
వైరంబని పల్కెఁ, గాకవల్లభు లోఁదక్. 32

సీ|| ఆ చిరంజీవి యిట్లను, విరోధంబున
కగు, కటువగుపల్కు గారణమ్ము.

[కార్యమ్ము విహతంబు] గాదె! మున్వాగ్దోష
మున నన్న, నతని యాననముగాంచి
యెట్లన, వి [భునకు] నెఱిఁగించెఁ గల దొక్క-
రజకు భారము వాపు రాసభి యది
వేసవి మేతకై వెస ద్వీపి చర్మా వృ
తంబగు దేహమ్ము దాల్చి, రాత్రి
యైన, సస్య వితానమరసి మేయుచునుండఁ
జేని కాపరి కాచి, చివికి చివికి

యలసి, యొకనాఁడు విల్లును నంపగములుఁ
బూని మసరకంబళమును ముసుఁగువెట్టి
పొంచికొనియుండ, [రాసభి] పూని మేయ
వచ్చి, ధూసరకంబళి వానిఁ గనియె. ౩౩

కం॥ ధూసరకంబళ మటుగని
రాసభమని కూయ, సస్య రక్షకుఁడు మదిన్
రా సభమని తలపోసి, శ
రాసనబాణమునఁ దన్ను నంతకుఁ గూర్చెన్. ౩౪

వ॥ అట్లు గావున వారలకును మనకును వైరంబు పెద్ద కాలంబున నుండి వాగ్దోషంబునం బొడమె, నది యెట్లనినఁ దొల్లి దివాంధ విభుని నొక్కని, నఖిల పక్షులు పక్షిరాజ్యంబునకుఁ బట్టంబుగట్టుదమని చనుదెంచిన, నందు మంత్రికర్ణుండను వృద్ధ కాక విభుండు చనుదెంచి పక్షుల కిట్లనియె. ౩౫

గీ॥ ఇతని నభిషేక మొనరింప నెట్లువచ్చు!
దర్ప సంయుతుఁడ, ప్రియదర్శనుండు
పక్షులనునెల్ల భక్షించి బలిసికొనును
నల్పుఁ జేపట్టఁ గార్యమ్ము లగునె! దలఁప. ౩౬

సీ॥ అధికునిఁ జేర్కొని యల్పులైనను సంత
సము నొందుదురు, మును శశకవితతి
యేపునఁదార కేశోపదేశమ్మున
బ్రతుకదే యని పల్కఁ జతురులెల్ల

ధంబంత నెఱిఁగింపఁ దగునన్న నాతఁ డి
ట్లని చెప్పె, మునొక్క వనమునందు
దంతులు ద్వాదశాబ్దంబు లనావృష్టి
యైనను, జలములేకా, తమ్మఁగలఁగి, 37

గీ॥ ద్విరద విభుఁజూచి పల్కెనో దేవ! చంద్ర
కిరణ తాపమ్ము మేనును గ్లేశపరుప
—— —— —— ——
—— —— —— ——

కం॥ కరివల్లభుఁడంబు సరో
వరముల బ్రహవముఁలను వెదుకఁ నడిగల నుత్త
ద్విరదమ్ములఁ బంపె దిగం
తరముల నవి చూచివచ్చి, తమపతి యెదుటన్. 38

వ॥ నిలిచి, యిట్లని విన్నవించె,— 39

చం॥ కరిపతి! నీవు వంపఁజని కంటిమి చంద్రసరోవరమ్ముఁ, బ్ర
స్ఫురదురు శంఖచక్రములఁ బోల్చి పయోరుహలక్ష్మి నెంతయున్
సురుచిరమై జనార్దను తనుక్రియ నెప్పుడు మీఱుదానిఁ బు
ష్కరయుతమైనదాని, జలజంతు తతిన్ దగుదాని, నొక్కచోన్॥ 40

వ॥ అని చెప్పిన విని, యతులితంబగు సంభ్రమంబునఁ దత్ప్రదేశమ్ము
వాసి. 41

శా॥ ఆ నాగేంద్రుఁడు సంతసమ్ము దన నుద్యత్కాల మేఘాకృతిన్
దానాంభఃకణసంచయమ్ము వడియన్, దంతావళశ్రేణితో
నానాభూజములెల్ల వ్రాల, శశసంతానమ్ము వైవస్వత
స్థానంబుద్ధతిఁ జేరబో, నడచెఁ జంచద్వేగ సంరంభియై. 42

వ॥ అయ్యవసరమ్మున శిలీముఖనామధేయుం డగు శశకవల్లభుండు
నిజప్రధానవర్గమ్ము నవలోకించి, వారణసందోహంబనవరతమ్మును జలాభి
లాష నన్యసరోవరమ్ములకు నడువ మన బలఁగంబెల్లఁ బోలియందొడంగె,
మనకుం జేయునది యెఱింగింపుఁడన, నందు బహువృత్తాంత విదుండగు వృద్ధ

ఆ॥వె॥ దేవ! దంతి ఘటలు నీసరసీరుహ
నమరఁ గుంటుఁ జేయ నాకు నెవ్వ
గలుగ టట్లు, నధిప కౌతూహల స్వాంతుఁ
డగుచుఁ బలికె, విజయు నవ్విభుండు॥ 44

కం॥ తనయక నేయము వినుఁ, డె
న్నఁడు నీతివిదుండు దేశకాల విభాగం
బడరఁగఁ దెలియును, నాతం
డిడుమలఁ బొందఁడు సిరియు నెంతయుఁ బొందున్. 45

కం॥ అని పల్క నాకలీముఖు
పనుపునఁ జని విజయుఁడపుడు భద్రేభములన్
గనుగొని చింతాకులుఁడై
తన హృదయములోన నపుడు దలపోసి తగన్॥ 46

కం॥ కాయంబల్పము, దంతి ని
కాయము దానోత్కటంబుగావున, వినయో
పాయమునన్నైన దాయ న
పాయమునేకులు నటించు ప్రజ్ఞాస్వాంతుఁడై. 47

వ॥ విచారించి యొక్క భూధర శృంగంబెక్కి యోగజేంద్రా! నీకు భద్రంబగుననిన, నతండు నీ వెవ్వండవు! నీరాకకు గతంబెయ్యది నాకెఱింగింపు మన, నవ్విజయుండిట్లనియె. గజపతీ! నేఁ జంద్రదూతను దన్మండల మధ్యంబున విహరించుచుండు శశకవిభుండ, నా పేరఁ జంద్రుండు శశాంకుడనిపించుకొనియెను. నానాథుండగు చంద్రుఁడు నీతోఁడి సఖ్యం బపేక్షించి, నన్ను నీ సమ్ముఖమ్మునకనిపిన వాఁడని యెండియు నిట్లనియె,— 48

కం॥ తలపోయ నిష్ఠురోక్తులు
పలికినఁ, దిట్టినను, భూమి పాలురకును వ
ధ్యులుగారు దూతలెందును,
బలభిన్నభభోగ! నూత్న భరతాచార్యా! 49

వ॥ అట్లు గావుననే హిమకరునానతిం బలికెద, స్వపర శక్తి నెఱుం

చంద్రాధీనంబైన యీ సరోవర రక్షకుల నీవలంచితివి. ఆ శశకంబులు జంద్రుండు నిజ శరీరమ్ముగాఁ దలంచు, నదియునుంగాక వనవెల్ల నమ్మహాత్ముండాకసమ్మున వర్తించు, నిశా సమయంబున నా చంద్ర సరోవరమ్మున వసియించి యుండు, నీవును నీపరిజనమ్మును నిదాఘ కాలమ్మున నోర్వలేక యీ చంద్ర సరోవరంబు ప్రవేశించుటకై పోవుచున్నవారు. అచ్చటికిం బోయిన నీకును నీ పరివారమ్మునకు నాపద వచ్చు. చంద్ర చిత్తం బెఱింగి నే నీకుం జెప్పితి, నా ప్రాంత ప్రవేశంబును, శశక మర్దనంబును, బరిహరింపుమని చెప్పిన విని, గజేంద్రుడతి భయమ్మున నిట్లనియె,— 50

సీ॥ అజ్ఞాన కృతమున నయ్యెఁ దత్కృతమేటి క
రంబు పద్ధతి, యిట్టి దోసమున్న,
గజ వల్లభునిఁ జూచి విజయుండు పల్కెఁ, జే
వరు దెంచి యంపిలి యమృత కరునిఁ
జూచి పొమ్మని, రాత్రి సొంపారఁ దన్న దో
డ్కొని చని యా కొలఁకునకు డాసి
పానీయములలోనఁ బ్రతిబింబితుండగు
చంద్రునిఁ జూపఁ, దత్సమయమందు

వందనమ్మొనరించి యో వారిజారి!
తప్పులెల్లను లోఁగొను దయదలిర్ప,
నెన్నఁడీవంక రామని యేఁగఁ, గాంచి
శశక సంచయమాత్మ నుత్సాహమొందె. 51

వ॥ ఇట్లుపాయమ్మున విజయుండు గజమ్ములం దొలంగించి తనభర్తయగు శిలీముఖున కవ్విధం బెఱింగించి సుఖంబుండిరి. అట్లు గావున నీ దివాంధుం జేర్కొన నాపదలణంగవు. హీనాత్ముండు ప్రజా పరిపాలనంబున కొప్పునే! యని వెండియు నిట్లనియె,— 52

చం॥ చెనఁటి నబుద్ధిఁజేసి గుఱిఁజేసిన వారలు, నొత్తు రెంతయున్
బెనుపరి కూలవే! శశకపింజలముల్ మును పిల్లిఁజేనన్
విని పతగమ్ము లెట్లనిన, వేడుకఁ జెప్పెను దొల్లి భూరుహం
బున వసియించి యుండుదు ప్రభూత కుతూహల మానసుండనై. 53

గీ॥ కుంపటం బరుకోటరమ్మున ననఘుమతి క
పింజలమ్మొండు నాలోడఁ బ్రియము కలిగి,
అస్తమానా? సపనమున నరిగె నొక్క-
నాఁడు నెంజేసి, మేతకై పోకిమిఁగను 54

వ॥ తదవసరంబున,— 55

సీ॥ ఆ కోటరమ్మున నప్పుడు శీఘ్ర క
ర్ణుండను శశక మొకండు నిల్చి
కొంత కాలంబుండ, నంత కపింజలుం
డేతెంచి నా నెలవెవ్వఁడిప్పు డి
ట్లై కొన్న వాఁడనఁ, గైకొని కాతఁ డీ
ప్సను, నున్న వారిదే యగును నెలవు,
ఎవ్వఁడు మున్నుండె నిప్పటిలంగను
వానిదే నెలవని, వాదులాడఁ
గని. నేను వారలఁ గడకుఁ బోఁద్రొబ్బినటుఁ
నగవుకు బొంకని న్యాయము కూర్చి

గీ॥ ప్రీతి నేఁగితి నపుడా కపింజలుండు
న్యాయ్య మిరువురకును దెలియంగఁ జెప్పు
నతని నెఱుఁగవె! నీవని యడుగుటయును,
బరమ సంతోషుఁడై వాఁడు పలికెఁ దెలియ. 56

వ॥ యమునా తీరమ్మున నతి ధార్మికుండను నొక్క వృద్ధ మార్జాల విభుండు గలండ, తండు మనకు ధర్మమార్గం బెఱింగించునని దీర్ఘకర్ణుండు పలికినం, గపింజలుండిట్లనియె. వాఁడల్పజాతి మనకు విశ్వసింప వచ్చునే! యన వాఁడిట్లనియె,— 57

గీ॥ అతని మనకేల డాయంగ మతిఁదలంప
న్యాయమార్గమ్ము దెలిసి సన్మాన మొస్ప
మగుడి చను దెంత మనినఁ దన్మానసమున
నాతఁడిరువురకును సమంబని యెఱింగి,— 58

గీ॥ అప్పుడీసవ్వురు జనముస నరిగి వాని
కంటిపయును జెప్పఁ, గడు వృద్ధనైతి, నాకుఁ
జెవులు వినరావు డగ్గఱి చెప్పు మనుచుఁ,
బోమ ధర్మము విశ్వసింపంగఁ బలికె. 59

కం॥ సంసారముల స్థిరము, ల
హింసకు సమమైన [ధర్మ] మేదియుఁ, సుజనో
త్తంసునకుఁ దెలియఁ దగునది,
కం సారిపదాబ్జభృంగ! కరణిక లక్ష్మ! 60

కం॥ పరకాంతలఁ దల్లుల క్రియఁ
బరవిత్తము పెచ్చుమాడ్కి భావించి మదిన్
బరుల శరీరమ్ములఁ దన
కరణిని జూడంగవలయుఁ గరణిక లక్ష్మ! 61

వ॥ అని యిప్విధమ్మున నాదధికర్ణుడు పరమ ధర్మశాస్త్రంబు లుపన్య
సించిన, విని మనంబున విశ్వసించి [శశ]క కపింజలులు డగ్గఱిన, సమ్మార్జాలం
బయ్యిరువుర భక్షించి తన శరీరంబు పోషణంబుఁజేసికొనెఁ, గావున నిట్టి యుల్
ఘూకంబు గుఱిచేసి సమస్త పక్షి రాజ్యంబునకు నభిషేకం బొనరింపుట
యకర్తవ్యంబనిన నయ్యవసరంబున,— 62

చం॥ పతగములెల్ల వాయసము పల్కులు తథ్యములంచు నేఁగినన్
మతిఁ [దలపోసి] రోషమున మండి దివాంధుఁడు కాకిఁ జూచి కు
త్సితమునకేమి కారణము [మిసీ] విభవమ్మున [కెల్లఁ బో]సెఁ జే
సితి, మును నీకు నెగ్గొకటఁ జేసితినే యని పల్కె నల్కతోన్ 63

వ॥ అది మొదలుగాఁ గాకోలూకమ్ములకు వైరానుబంధమ్మయ్యె,
నన విని మేఘవర్ణుం డాకర్ణించి జయోపాయం బెఱింగింపుమనినఁ జిరంజీవి
యిట్లనియె, సంధి విగ్రహయానాసనద్వైధీ భావమ్ముల నలేఁడ సాధ్యుండు-
ఆశ్రయంబుననైనను, చిర ప్రయాసంబుననైనను,బగతున కపాయంబు నొందింప
వలయునని వెండియు నిట్లనియె,— 64

గీ॥ పరులు పెక్కండ్రు గూడి సర్వజ్ఞునైన
మోసపుచ్చంగవచ్చు మున్ భూసురుండు

[పాత] మని చెప్పినదేం బజాతి క్షితి
యహితుండైనను నేడేమి సత్యదక్షిణ! 76

కం॥ మును........
......జాతిన క్షితి నేం.
పునఁగాచెదనఁగ వినమే
ఘనునకు ధా......జయమ్ము కనిశిక లక్ష్మి! 77

గీ॥ చెనఁటిస్నేహము ప్రియమొప్పఁ జేసినేని
పతిఁడు వనకొంతయును హితవాచకంపు,
మున్ను వృషభవాక్యమునఁ గాదె! ముచ్చు, తెగిచి
కొనిన విత్తమ్ము తన్గృహస్థునకు నొసఁగె. 78

వ॥ అదెట్లని ఘూకప్రభుండడిగిన నతం డిట్లనియె. మున్నొక పురమ్మున సార్ధవాహుండను వృద్ధ వణిక్కు గలండతని భార్య నవయౌవనాంగి కల దా, జంత యెన్నండును బతిని గైకొనక—పరి రంభణమ్మునకుం జొరక యుండునంత నొక్కనాఁడు,— 79

కం॥ చోరుండొకఁడు సురంగ
ద్వారమ్మున నిల్లుసొచ్చి వచ్చుట గని, త
న్నారి భయమంది యప్పుడు
గారవ మొప్పార విభునిఁ గౌఁగిటఁ జేర్చెన్॥ 80

వ॥ అప్పుడప సార్ధవాహుండును బరితుష్టుండై గృహముననున్న చోరుంగనుంగొని యిట్లనియె. 81

కం॥ కలనైనఁ గౌఁగిలింపని
కలకంఠినిఁ గూర్చితివి సుఖం బొప్ప నను,
దలఁప నినుబోలు చుట్టము
గలఁడే! విత్తమ్ము నీవు గైకొను మనుచున్॥ 82

వ॥ చోరుండును గరుణాపరుండై నీకు సుఖమ్ము సిద్ధించినఁజాలు, నా చేత నపహరింపఁబడిన విత్తమ్మెల్ల నీవే కైకొనుమని యతనికొసంగి యతని సాధ్వికి పతినెఱింగి సేవజేసుక బ్రతుకుమని బుద్ధిచెప్పి యతి కుతూహలమునఁ

ఖన నిలయమ్మునకుం జనియె, నట్లుగావున నితనికి హితవాచరించుట కర్తవ్యం
బను నవసరమ్మునఁ బింగళాక్షుండను వాఁడు ఱికిఁడి దాసీ యా రాజుతో
నిట్లనియె,— 83

కం॥ పగతునిఁ [గ్రక్కొన]ఁబోలునె
తెగటార్పక యున్న. వాఁడె తెగటార్చుఁ జుమీ
—గి———నైన——వు
—గి——కాల———నట్లుగాదె ధృతి పగవాఁడుక్ 84

వ॥————

సీ॥ దేవ నా పల్కు సందేహమ్ము లేవ, భీ
యాతి నైనను మాటలాడినపుడు
పరమహితుండగు బ్రహ్మరాక్షసుచేత
ధేనుద్వయము, కన్నగాని చేత
నాయువు, నీఁ బడె నవనీ సురునికన్న,
నా కథ యెఱిఁగింపు మనినఁ, బొల్లి
కలఁడు విప్రుఁడు ప్రతి [కల్యంబునతఁడు] గో
యుగమును మేపుచు నుండుగాన

నట్టి యావుల నొక చోరుఁడపహరింపఁ
దలఁచి నిశివేళఁ బోవ నాతని శరీర
మన్యగాత్రమ్ము సోఁకిన నరుదునొంది
యెవ్వఁడవు చెప్పమన్న వాఁడిట్లు పలికె. 85

గీ॥ సాహసుండను బ్రహ్మ రాక్షసుఁడ నీవు
నెవ్వఁడవు నాకు నెఱిఁగింపు మిప్పుడనిన
నేను జోరుండ నన, నతండేమి గోరి
యేఁగు చున్నాఁడవని తన్ను నెలమి నడుగ 86

వ॥ ఏఁ దస్కరుండ సమీప గ్రామ నివాసియగు విప్రుని గోయుగం
బపహరింప నేఁగుచున్న వాఁడననిన, నా రాక్షసుండును మద్గమనం బతనినిఁ
బట్టుటకని చెప్పి యా యిరువురును నా భూసుర మందిరమ్ము ప్రవేశించి
రయ్యవసరమ్మున,— 87

పలుకులఁ బ్రీతి సంపదఁ దేలుచును రథ
కారుఁడు [రమణిని] జాయతోడఁ
దల మోచికొనుచు నృత్యం బాచరింపఁడె
యన విభుఁ డెఱిగింపుమనినఁ దొల్లి
కలఁడొక పురి రథకారుఁ డతండు దు
శ్చరిత యా తన భార్య జాడ దెలిసి

గీ|| రాజు కూటమి గలిగుండ, రాజుతోడఁ
గర్జమున్నది వే నరుగంగ వలయు
ననినఁ ద్రోవకు సంబళం బప్పుడొసఁగి
యనిపి తనమది సంతసం బందియుండ,
నెలమి రథకారుఁ డెవ్వరు నెఱుఁగకుండ|| 93

వ|| తన భార్యకుం జెప్పి బంధు దర్శనార్థం బొకపురంబున కేగవలసెను, రాజుచేత నామంత్రితుండనైతి, నేనుం బోయివచ్చెద నని వీడ్కొని కొంత దవ్వరిగి యెవ్వరు నెఱుంగకుండం, గ్రమ్మఱ విభావరీ సమయమ్మున నిజ గృహమ్మున కేతెంచి తనభార్య యెఱుంగకుండఁ బర్యంకమ్ము క్రింద నడంగి యున్న సమయమ్మున,— 94

గీ|| శంక యొక్కింత లేక యా[అంకుటా]లు
దూతికా ముఖ వార్తచేఁ బ్రీతినంది
చేరవచ్చిన జారుని గారవించె
తేజరిల్లు కటాక్ష నీరాజనమున. 95

కం|| ఆకులట జలకమాడఁగ
నేకాంత-స్థలముగూర్చి యేగిన, మదనో
ద్రేకమున జార పురుషుఁడు
చీకాకునఁ బొరలె కొంతసేపటి లోనన్. 96

గీ|| ఎప్పుడేనియు దిఙ్మదేభేంద్ర కుంభ
సన్నిభములైన పాలిండ్లు జారకాంత
నాయుర స్థలిఁజేర్చు మన్ననదలిర్ప, 97

కం|| ఇదియేటి సుఖము, నాథునిఁ
గదిసిన సుఖమునకు సాటిగలదే! యనినన్
మదిలోనఁ దత్ప్రియుండును
ముదమొదవ వధూటివాక్యములఁ కవ్వేళన్|| 104

వ|| పర్యంకమ్ము క్రిందనుండి వెడలివచ్చి కంకటిపై భుజంగసమేతయై యున్న, యయ్యంగనం దోడుకొని రాజమార్గంబునఁ బత్రివతాధరణం బిదియని కొనియాడం బోడంగె. అట్లు గాకుండఁ బ్రత్యక్షదోషం బెఱుంగ వలయుననిన, రోషారుణీకృతాక్షుండై ఘూకపల్లభుం డతనివాక్యంబు ల నాదరంబుచేసి, చిరంజీవినిఁ జేపట్టి కోటకంబునకుం దోడ్కొని చని సుఖం బున్న సమయమ్మున, నక్కాకం బవ్విభున కిట్లనియె. 105

సీ|| పాపకార్యులనైనఁబడి దేవరకు హితం
బాచరించెదను దథ్యంబటన్నఁ
గెరలి రక్తాక్షుండు మరణహేతువు, సెప్పె
మునినఁ జిరంజీవి యపుడు సెప్పెఁ
గౌశికత్వము నొంది కాకకులమ్ము సం
హారమ్ము సేయుదుననిన, నవ్వ
తన జాతికాక తక్కసజాతిఁ బొందంగ
[వలచి] భాస్కర మేఘవాయు భూధ

గీ|| రములచేఁ బాసి [మూషిక తమ] కులంబు
విభుని వరియింప [దే! యన] న విని యతండు
తనున దెట్లని యడిగిన, మునుమహాత్ముఁ
డైన ముని, జాహ్నవీ తీరమందు నిలిచి 106

వ|| తపమ్ము సేయుచుండ నొకనాఁడు గగనమార్గమ్మునుండి శ్యేన ముఖమ్మువలన, విడివడి తన కరమ్మునందు మూషిక శిశువువడిన నతండు,— 107

గీ|| తన తపశ్శక్తి పెంపార, దాని నొక్క
కన్యకామణిగాఁ జేసి కౌతుకమున

భాగ్యకోసఁగిన, నదియును బ్రతిదినంబు
మైత్రిఁ బోషించెఁ దనకన్న పుత్త్రికరణి. 103

ఆ. వె. అబ్జరేఖవోలె ననుదినమ్మును వర్ధ
[మాన] యగుచునుండె మౌని [యపుడు]
తగిన వరుని వలయుఁ దన కన్యకని చండ
కిరణుఁ దలఁప నాతఁడరుగుదెంచె. 109

సీ॥ అప్పుడా ఋషి పంకజాప్తునిఁ బొడగని
యీ కన్యకకుఁ బరిగ్రహింపుమనఁగ,
బలియుండు నాకంటెఁ బర్జన్యుఁడన, విని
తలఁచిన నాతఁడు నిలిచె నెదుట,
నతనిఁ జేకొమ్మన్న, నధికుండు పవమానుఁ
డనిన నాతనిఁ బిల్చి యడుగుటయును,
నద్రులు కడునెక్కుడని చెప్ప, [నద్రులఁ
బిలిచి] గైకొనుడన్నఁ బ్రీతినవియు,

ఆ॥ వె. మూషికప్రభుండు మొదలి పూనుండన,
వాని కెఱుకసేయ వాఁడు మర్త్య
కన్యనెట్లు పొందఁగా వచ్చునన, ముని
యెలుకఁ జేసె దానిఁ దొలుతయట్ల. 110

వ॥ ఇట్లా ఘనుండు మూషికంగా జేసి మూషికవిభున కొసంగె నట్లు గావున నెవ్వరేనియుఁ దమతమ జాతిం బొందుదు, రింతియ కాని యన్య జాతిం బొందుట దుర్లభంబు. ఈ వెట్టికాకి యాడిన నెట్లని! చెప్పిన విని, యెన్నెన్ని భంగులనైన నీఘూకపతికి హితం బాచరించెదనని పల్కి, చిరంజీవిం జూచి దివాంధవల్లభుండిట్లనియె,— 111

కం॥ వలసినతఱి నాహారం
బుల నొందుచు, నీ గృహంబుపోలిక నతని
ర్మల బుద్ధి నుండుమని తనుఁ
బలికిన, ముదమంది కాకపతి సచివుండున్. 112

—— —— యప్పుడు జీవహింస
యని [ముని] మాడ్కి నుండినను బ్రీతి
నొక కప్పచేరి యిట్లో ఫణిరాజ! ని
రాహారవృత్తి నీ హ్రదములోన
నేటికి నున్నాఁడ వెఱిఁగింపుమనఁ బాము
నిట్లనె మున్నొక్క యిద్ధగుణుఁడు

గీ॥ బ్రాహ్మణా —— —— ——
పోవుచును నన్నుద్రొక్కినఁ బోక నేను
కఱచి వానినిఁ ]జంపితి[ఁ గరుణలేక
వాని తండ్రియు నది విని వచ్చె వేగ. 123

వ॥ వచ్చి నన్నుఁజూచి నా చిఱుతకొమరుని నీవు మృతిఁబొందింపఁ దగునె —— —— —— —— యింత తప్పుఁ జేసితివి నా సామర్థ్యంబున నిన్ను భస్మీభూతమ్ము సేయంజాలుదు నైనను హింస సిద్ధించునని వెఱచి యున్నవాఁడ. నేఁటినుండియు నీకాహారంబు —— —— —— యపుడ నీకు మృత్యువు సిద్ధించునని నాకు శాపంబిచ్చి యా పాఱుండు యథేచ్ఛ నరిగె, నంతనేను నిమ్మడువునకు వచ్చి నిరాహారుండనై యుగ్రతపమ్ము సేయుచున్నవాఁడ, మఱియును,—— 124

కం॥ —— —— ప్పరి
యీ వారిధి నున్నవాఁడ యింద —— ——
నా వలనను బ్రోవుండనఁ
దావేగంబరిగె కప్ప తన పతికడకున్. 125

వ॥ అట్లతి త్వరితగతిం జని తమ యేలికయగు జాలపాదుండను మండూకపతి [కిభుజగ] పతివృత్తాంతంబంతయుఁ జెప్పిన నతం డాశ్చర్యమ్ము నొంది తన పరిజనమ్ముసు దానును దందశూకంబున్న యెడకువచ్చి యతనిం గాంచి యిట్లనియె. 126

మ॥ జలపాదుండను భేకవల్లభుఁడ, నుత్సాహమ్ముతో వచ్చితిన్
జేలమొప్పంగను నీదు నిష్ఠకును నిచ్చన్ మెచ్చితిన్నంచు కుం

స్థలభాగాదుల! యొక్కనాఁడు గతిమందంబైన, మన్మానసం
బలరంజేయుచు నేఁడు శీఘ్రగతిచే నన్నున్, బ్రియంబొప్పఁగన్. 127

కం॥ నాకాహారము లేనన,
భేకంబులఁ గొన్ని దినము ప్రియమున నన్నున్
గాకోదరమ్ము వానిం
జేకొని భక్షించె నతఁడు చెప్పినమాడ్కిన్. 128

వ॥ అప్పుడా జలపాదుం జూచి భవదనుజ్ఞఁ జేసి మదోద్భోగమ్ము పోషింపంబడియె, నీవు విఖ్యాతచారిత్రుండవు. నీవిడిన యాహారం బగుటం జేసి విప్రశాపంబు నన్నేమియుం జేయలేదు, నీ నిమిత్తంబునఁ గృతార్థుండనైతినని చెప్పె. నిజగతి విశేషంబుల నమ్మండూకపతి మూర్ధంబుమీఁదం జరిపెలాడ, నతండు మెచ్చుచుండఁ గ్రమక్రమంబున నా కప్పల నన్నిఁటిని మెక్కి యొక్కనాఁడు,— 129

కం॥ తలపోసి యబ్భుజగము
జలపాదుని బిలిచి యన్న పలికెద నేఁగన్
బలయుతనని, యప్పుడు మెల్లఁ
బలుకఁగ విని యాతఁడేమి భావించి తనన్. 130

కం॥ పుడమిన్ విప్రుని శాపముఁ
గడచితి మండూకముండఁగా నంచును నే
నుడుగుల నుడుగకయున్నా
నడరఁగనని, మఱియుఁ జెప్ప నాతఁడు మదిలోన్. 131

వ॥ విశ్వసించియుండ నతని భక్షించి చనియెం గావున, బహూపాయమ్ముల శత్రు నిశ్శేషంబు సేయుట నీతిమార్గంబని యొఱింగించి, చిరంజీవి యోదేవా! భాగ్యసంపన్నుండ వఖిలవిభవమ్ములు నిన్నుం బొందెదనని వెండియు నిట్లనియె. 132

సీ॥ విద్వత్కవులయందు విశ్రాణంబును,
ప్రత్యర్థి విభులందు బాహుబలము,
శరణాగతులయందుఁ గరుణాకటాక్షంబు,

బంధుసంతతియందుఁ బరమ సంతోషమ్ము,
నాశ్రితులందుఁ బాయని తలంపు,
ధర్మ మార్గమునందుఁ దగిలిన చిత్తమ్ము,
సత్య వాక్యములందుఁ జతురతయును,
గలిగి యెవ్వాఁడు మెలఁగు జగత్త్రయమున
నతని కీర్తులు లుబ్ధమోహాంధ తమస
పటల మణఁగింపఁ జంద్రికా ప్రభలయట్లు.
లలిత గుణధుర్య! విత్తయ లక్ష్మణార్య! 133

వ॥ అని యివ్విధంబునఁ జిరంజీవి తమపతియగు మేఘవర్ణునిఁ బ్రహృష్ట
చిత్తుం జేసెనని నరేంద్రనందనులకు విష్ణుశర్మ యెఱింగించెనంత. 134

శా॥ శేషాద్రీశ్వర పాదపద్మయుగళీ చింతారత స్వాంత! వి
ద్వేషామాత్య జనాభివర్ణిత యశోవిఖ్యాత! నానా కళా
భాషావల్లభ! నీతి శాస్త్ర పఠనాప్రావీణ్య! చంచద్వయో
యోషా నూతన మీనకేతన! నృపోద్యోగానవద్య ప్రియా! 135

కం॥ చందన హరిహయహరి హార
కుందేందు సమాన కీర్తిగోచర! [శిష్టా]
నందకర! రుక్మమాంబా
నందన! [శిబిఖ] చరవితరణ ప్రఖ్యాతా! 136

కవిజలరుహ మిత్రా! కంతు సంకాశగాత్రా!
నవ వితరణరాగీ! నాకపాభోగభోగీ!
ప్రవిమలతర కీర్తీ! బంధు సమ్మోదవర్తీ!
భువనహిత చరిత్రా! పూరుషోద్యత్పవిత్రా! 137

ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యా విచిత్ర, తిప్పన మంత్రి
పుత్ర, సుజన విధేయ, భానయనామధేయ ప్రణీతంబైన
పంచతంత్రి యను మహా ప్రబంధమ్మునందుఁ
తృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము

శ్రీ నిలయ కటాక్ష! కులో
ద్యాన వనవసంత! సంతతానంద! మహ
స్నేహ నిరుపమాన గుణ! ల
క్ష్మీ నారాయణ! మనోజ్ఞ కీర్తి ప్రసరా! 1

వ॥ లబ్ధనాశంబను చతుర్థతంత్రం బాకర్ణింపుము 2

కం॥ తనుఁ బొందిన యర్థము సాం
త్వనపున్ వచనములచే వదలు నేవాఁడే
ని, నతండు మోసపుచ్చఁబ
డును నక్రవిభుండు మర్కటునిచేఁ బోలెన్. 3

గీ॥ అన నితాంత కౌతుకాయత్త చిత్తులై
యక్కుమారకులు ప్రియంబుతోడ
నతనిఁ జూచి పల్కిరనఘాత్మ! మాకిది
చెవుల పండువౌదవఁ జెప్పవలయు. 4

వ॥ అనిన మహాత్ముండగు నా విష్ణుశర్మ యిట్లని చెప్పందొడంగె. మున్ను పుడిసిఁటంబట్టి మ్రింగిననాఁటి బన్నంబు వాపుకొనుట కొఱకుఁ గుంభ సంభవు నొడిసి పట్టి కొన, దిశాభాగమ్ముల వెదుకఁజూచు బాహాదండమ్ములన గంధవహప్రేరితంబులై యొండొండ సముద్దండ వేగమ్ములై చనుదెంచు నిడుద తరంగములును, చండకిరణ పరితాపంబున నభోమార్గంబునఁ బ్రకాశింపక శీతల జలక్రీడా వినోదంబులఁద్రుళ్ళింతలిడు తారకంబులన నంతకంతయు నెగయు నంబుకణజాలమ్ములును, *సవన పవనభుగ్వ్యక్తి విరాజితంబగు మందర మహీధర భ్రమణ భారమ్ము వలన, మహాయాసంబు నిండిన వృద్ధశ్రవు నిట్టూర్పుల వలనం బొడమె నన, వెడ వెడ దిగ్భ్రమణం బాచరించు నావర్తంబులును, నిజాంతర్గత విజృంభమాణ బాడబశిఖి శిఖాభయోపప్లవంబు చేతం బెగ్గిలి కూయిడు నఖిల జంతు నివహంబన నితాంత బధిరీభూత రోదోంతరంబులగు నతిభయంకర నిర్ఘోషంబులును, నఖిల జగదధీశ్వర మహనీయకీర్తి

* "సవనవన" అని మూలము.

పుంజంబులు తన యొడలం జక్కిన నిక్కంబున మహాసిత హూహూ హాలహల హీరహార హారికర్పూరకృత ముక్తా మహోన్నత విశ్వేశ్వా —— —— నారద నిరత నాగవపారద హిమవత్కైలాస కైరవహాస కర్పూరంబులగు డిండీరమండలంబులను, గలిగి యతి మనోహరంబై పుండరీకాక్షు జఠరంబునుంబోలె ఘనరత్న పూర్ణంబై, పాపధూమ కేతనంబునుంబోలెఁ బ్రబల భుజంగ సంకీర్ణంబై, మధ్యమ లోకంబు నుంబోలె ననేక భూభృత్సంకులంబై గ్రహమండలంబునుంబోలె మీనకుళీర కర్కట భాసురంబై, నాకంబునుంబోలె దివ్య వాహినీ సమాశ్రయంబై, పొలుపొందు నజ్జలధి వేలాసమీపంబున,—— 5

చం॥ కలదొక మేడి భ్రమాను మహా గన్నమనన్, ననయంపు జంతు ఫ్న
త్ఫలములు విష్ణు దేహమునఁ బద్మభవాండములట్లు పుట్టువున్,
నిలుకడ, చేటు, నొంద ధరణిన్ గతుకాఖ్యమై ద్విజ వ్రజం
బులకు నభీష్టదంబయి నభోమణి చుంబిత దీర్ఘశాఖమై॥ 6

కం॥ ఆ తరువున వానర సంఘాతముతో నొక్కవృద్ధ కపిపతి వినయో
పేతుడు బలవర్ధాఖ్యా(ఖ్యా)తుఁడు విహరింపుచుండుఁగౌతుక మొదవన్ 7

వ॥ తత్కపివరుండును నితాంత మధురంబులగు నౌదుంబర ఫలమ్ము లనుభవింపుచు నుండు, నొక్కనాఁడు నిజశయన తలమ్మున నొక్క మేడి పండు పడి నిలుపక యహాపావనమ్ముల నిర్ఘోషమ్ము వొడమం బడియె నయ్యెడ,—— 8

మహాస్రగ్ధర॥ పటువాలక్షేప జంఝా పవన వశమునన్ భైరవావర్తముల్ ప్ర
స్ఫుటముల్గా, బుద్బుదంబుల్ భుగభుగ నినదోద్భూతముల్గా, నభోలో
ద్భట వీచుల్ ఖండముల్గా, బహుతర మకరాధ్యత్ముఁ డేతెంచె, గంగా
తటినీకాంతగ్గతుండై తనరు జవమునన్ దద్ధ్వనిన్ విన్నమాత్రన్॥ 9

వ॥ ఏతెంచి శింశుమారాభిఖ్యానుండగు తద్గ్రాహాధిపతి యుద్య దరుణ మండలం బాగ్రహంబున గ్రహించు రాహుగ్రహంబన నౌదుంబర ఫలమ్ము చేకొని భక్షించి పునః ఫలాహార మనోరథమ్ముల నచ్చట నుండఁ గతి పయదినమ్ములు చనియె నంత,—— 10

కం॥ బలవర్ధుఁడు తన తోడుతఁ
జెలిమి మనః ప్రియము వొడమఁ జేసెయెడ నెడన్

